

| | | Frequency | Fare |
|---|---|---|---|
| 1. | Delhi-Shimla-Kulu-Manali-Chandigarh-Delhi | Every Friday | 2,200 |
| 2. | Delhi-Agra-Jaipur-Delhi | Every Monday | 700 |
| 3. | Delhi-Mussoorie-Haridwar-Rishikesh-Delhi | Every Friday | 600 |
| 4. | Delhi-Mathura-Brindavan-Agra-Allahabad-Varanasi-Saranath-Gaya-Budha Gaya-Lucknow-Ayodhya-Naimisaranya-Delhi | Every Friday | 3,200 |

Fare includes complimentary Dormitory accommodation and transport / Guide charges. Tariff for Tour No. 4, is inclusive of food also enroute, except at Delhi. We are running LTC tours for Central Government employees in collaboration with ITDC. All tours are by Super Deluxe buses, starting from our New Delhi office. Contact our offices for advance reservations.

మీరు ఢిల్లీ వచ్చినపుడు అధునాతన సౌకర్యములతో నిర్మింపబడిన మా "హొటల్ సదరన్"లో బస చేయండి. ఢిల్లీలో మా హొటల్‌లోని అమరావతి/ సుప్రభాత్ రెస్టారెంట్లలో రుచికరమైన తెలుగుభోజనం, అరిసెలు, బందరు లడ్డు, బూంది, చెగోడీలు, మొదలగు తీపి/కారం పదార్థములు కూడా లభించును.

*Our Super Deluxe Video buses & tourist cars are available on contract for tourists. Our recipts are approved for LFC purposes.*

***Air/Rail Reservations are also undertaken.***

**for more details, please contact**


# Southern Travels/Hotel Southern

**(Recognised by Department of Tourism, Govt. of India, New Delhi)**

**ఢిల్లీలోని తెలుగు వారి ప్రముఖ వాణిజ్య సంస్థ**

**18/2, Arya Samaj Road, WEA Karolbagh,**
**New Delhi - 110 005.**

**(Phones : 5722210 (10 Lines); 5739508, 5782932)**

**Our branches :**

1. Hotel Ayodhya Building, Lakdi-ka-pool, Hyderabad - 500 004. (Phones : 223658; 227233) Fax : 040 - 3328993
2. Hotel Raj Kamal Complex, Near Shivananda Stores, Kumara Park East, Bangalore - 560 001. (Phones : 2267040; 2262633) Fax : 080-2252222
3. Hotel Howrah Complex, Opp. Madras Central Railway Station, Chennai - 600 003. (Phones : 564864; 585253) Fax : 044 - 585253
4. No. 10, Swarnalok Complex, Opp. Apsara Theatre, Eluru Road, Governorpet Vijayawada - 520 002. (Phones : 572227; 576624) Fax : 0866-470207
5. Pavan Palace, Ground Floor, Opp. T.S.R. Complex, Dwarakanagar, Visakhapatnam - 530 016. (Phones : 545565, 541099) Fax : 0891 - 547190
6. No. 12 (Ground Floor), Manish A.C. Market, Near Dadar West, Mumbai-400 028. (Phones : 4326895; 4326688.)



Phone : 4941973

# అఖిలభారత్ షిర్డిక్షేత్ర సాయి భక్తనివాస్ ట్రస్ట్

పుష్పాంజలి హోటలు వెనుక, షిర్డి, (మహారాష్ట్ర)

అండర్ ది మేనేజ్‌మెంట్ ఆఫ్

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ

73-A, శాంతోమ్ హైరోడ్, చెన్నై - 600 028.



## విజ్ఞప్తి

ఆర్యా!

శ్రీరామ దత్తాత్రేయుల కలియుగ అవతార పురుషుడే శ్రీ షిర్డిసాయిబాబా. సహృదయముతో వారిని నమ్మి ప్రార్థించువారికి వారివారి కోరికలను తీర్చు భగవంతుడితడు. సమాధినుంచే ఈయన భక్తులను దీవించెదరు. సాయిబాబాను దర్శించుటకు వచ్చు భక్తుల వసతి సౌకర్యార్థమై మన సంస్థ ఒక చక్కని వసతిగృహమును నిర్మించుటకు ఒక పథకము వేసియున్నది. ఈ వసతిగృహములో ధ్యాన మందిరము, లాకర్లతో కూడిన జనతా హాలు, మరియు అన్ని విధములైన ఆధునిక సౌకర్యములతో కూడిన సుమారు వంద రూములు, రెస్టారెంటు ఉండును. ఈ భవన నిర్మాణమునకు సుమారు రెండుకోట్ల రూపాయలు వ్యయమగునని అంచనా వేయబడియున్నది. షిర్డి ఒక గొప్పక్షేత్రము. తిరుమలలో నుండు ఈ సంస్థ సత్రము పలువురి ప్రశంసలందుకొని యుండుట అందరికీ తెలిసిందే. ఈ ఆధునిక వసతులతో కూడిన భవన నిర్మాణమునకు భక్తులెల్లరు ధారాళముగా విరాళములు యిచ్చి ఈ పథకమును విజయవంతము చేయ ప్రార్థన. ఈ నిర్మాణము అన్ని కులాల ప్రాతిపదికన ఏర్పాటు గావించ బడినది. చెక్కులు/ డ్రాఫ్టులు చెన్నైలోనే మారునట్లుగా పంపవలయును.

## డొనేషన్ వివరములు :

| | |
|---|---|
| 1) | రూము డొనేషన్ : Rs. 1,01,116/- ఒక్కొక్కరికి 1 సం॥లో 25 రోజుల రూము వసతి.<br>ఇద్దరయితే చెరి : Rs. 60,116/- ఒకొక్కక్కరికి 1 సం॥లో 12 రోజుల రూము వసతి. |
| 2) | చక్రవర్తి పోషకులు : Rs. 50,116/- 1 సం॥లో 10 రోజుల రూము వసతి. |
| 3) | మహారాజ పోషకులు : Rs. 25,116/- 1 సం॥లో 5 రోజుల రూము వసతి. |
| 4) | రాజ పోషకులు : Rs. 10,116/- 1 సం॥లో 3 రోజుల రూము వసతి. |
| 5) | పోషకులు : Rs. 5,116/- 1 సం॥లో 2 రోజుల రూము వసతి. |
| 6) | లాకర్ : Rs. 1,516/- దోనరు పేరు లాకరు మీద వ్రాయబడును. |

ఈ విరాళములు ఇన్కంట్యాక్సు సెక్షను (80G) క్రింద వరుమానపు పన్ను మినహాయింపు కలదు

చైర్మన్ — శ్రీ కె. రాధాకృష్ణయ్య, కల్లూరు.

ఫౌండరు & మేనేజింగ్ ట్రస్టీ — భక్తశిఖామణి శ్రీ R.R. నాథం

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైదరాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండి నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండి విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి
ఆధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి
ప్రధాన కార్యదర్శి

V.P.- A5

తైల ప్రపంచములో మణి దీపాలు

# MR

బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి "

1, 5, 15 కే.జీ.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి – అతి
స్వచ్ఛమైనవి.

MR
BRAND

DOUBLE REFINED SUNFLOWER OIL



## MADHU REFINARY PRIVATE LIMITED
GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.

Phones : 42729. 42730. 42731. Resi : 42732. Fax : 42730. STD : 08552.

## MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,
Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.

Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం**-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం**-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎల్లాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండీ మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫొటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు 1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాత పేర సాధువులకు అన్నదానము చేయబడును "12×10" సైజులో దాత ఫొటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతినో సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

మరియు కార్యవర్గ సభ్యులు

యక్కలి బాలరత్నం — ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



స్థాపితము

1969



సంపుటి

29



సంచిక

9



మే - 1998



సంపాదకులు :

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

'సమాజసేవానిష్ణాత'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్స్ : 24911, 25025.


సంపాదకీయం

## ఆర్యవైశ్యసంఘాలకు ఏ అధికారమూ లేదు

ఆర్యవైశ్యసంఘాలు సేవాసంఘాలు. వాటికి శాసించే అధికారము కొంచముకూడ లేదు

'ఆర్యవైశ్యసంఘము' అని పేరు పెట్టుకున్నంత మాత్రాన్నే ఆ సంఘానికికానీ, ఆ సంఘానికి నేతృత్వము వహించే వారికి కానీ ఆ పట్టణము లేక గ్రామము లోని వైశ్యులందరి పైనా అధికారం ఉందనుకుంటే అంతకన్న తెలివితక్కువ ఉండదు.

సంఘాన్ని ఏర్పాటు చేయునపుడే ఆ సంఘాన్ని నియమ నిబంధనలతో రిజిస్టరు చేయిస్తారు. ఈ నియమ నిబంధనలనే "మెమోరాండము అండ్ ఆర్టికల్స్" అని అంటారు. ఆ సంఘానికి ఎవరు సభ్యులుగా ఉంటారు? వారి అధికారాలు ఏమిటి? ఆ సభ్యులపై సంఘానికి గల అధికారము ఏమిటి? అను విషయాలు కూడ ఆ నిబంధనలలో ఉంటాయి. ఇటువంటి వివరాలు లేకుంటే ఆ సంఘాన్ని జిల్లా రిజిస్ట్రారు వారు సొసైటీస్ఆక్టు క్రింద రిజిస్టరు చేయరు. రిజిస్టరు కాని సంఘానికి చట్ట బద్ధమైన గుర్తింపు ఉండదు.

అట్లు, రిజిష్టరైన సంఘములోని సభ్యులు - ఆ సంఘములో తమ సభ్యత్వాన్ని కొనసాగించినంతవరకే ఆ సంఘనియమాలకూ, నిబంధనలకూ బద్ధులుగా ఉంటారు. సభ్యులు తమ సభ్యత్వాన్ని ఎప్పుడైనా వదలుకోవచ్చు. సభ్యత్వము వదలుకొన్న వారు సంఘనిబంధనావళిని అనుసరించ నవసరము ఉండదు.

నియమనిబంధనల మేరకు సభ్యత్వమును స్వీకరించిన సభ్యులపై ఆ సంఘాధ్యక్షునికి లేక ఆ సంఘము వారికీ గల అధికారాలు ఆ సంఘానికి మాత్రమే పరిమితమై ఉంటాయి. సంఘసభ్యులు కాని వ్యక్తుల కార్యకలాపాలపై ఆ సంఘానికి అంటే ఇక్కడ ఆర్యవైశ్యసంఘానికి ఎటువంటి ఆంక్షలు విధించుటకు వీలులేదు. ఆంక్షలు విధించడమంటే ఆ వ్యక్తుల ప్రాథమికహక్కులు హరించడమే.

ప్రాథమికహక్కుల విషయములో జోక్యము చేసుకోవడం భారతశిక్షాస్మృతి ప్రకారము కఠినమైన శిక్షకు గురి కావడమే.

కొందరు వ్యక్తులు కలిసి ఏర్పాటు చేసుకొన్నదే సంఘము. ఆ సంఘములో ఉండుటకు యిష్టము లేనపుడు, ఆ యిష్టము లేనివారందరూ కలిసి మరొక సంఘాన్ని ఏర్పాటు చేసుకోవచ్చు. చేసుకో కూడదు అనే అధికారము ఏ వ్యక్తికీలేదు.

సొసైటీస్ఆక్టు క్రింద ఏర్పాటయ్యే ఏ సంఘాలైన సేవాసంఘాలే. అట్లే ఆర్యవైశ్యసంఘాలు కూడ. ఆ సంఘాల నిర్వాహకులు తమ సత్ప్రవర్తనద్వారా, స్నేహ సౌభ్రాతృత్వవైఖరితో వ్యవహరించుట ద్వారా, తాము చేపట్టే కార్యక్రమాల ద్వారా సంఘసభ్యులను కానీ ఇతరులను కానీ ఆకర్షించుకొని అందుకు అవసరమగు

ఆర్థికవనరులను సమకూర్చుకోవాలేకానీ మేము ఇవ్వమన్నంత రుసుమునుకానీ విరాళమును కానీ ఇవ్వలేదనీ, ఆ యివ్వని వారిపై అధికారాన్ని చెలాయించుటకు వేరే విధమగు దౌర్జన్యాలకు దిగుటకూ వీలులేదు.

అంతేకాదు, ఆ సంఘమునకు సంబంధించిన సభ్యులలో ఎవరికి యివ్వవలసిన గౌరవాన్ని వారికి ఇవ్వాలి - ఎవరు ఏ విధంగా ఉపయోగపడ్తే ఆ విధంగా గౌరవప్రదముగా వారి సేవలను తీసుకోవాలి.

లేని అధికారాన్ని ఉందనుకొని చెలాయిస్తే, దానివల్ల ఆ చలాయించిన వారికి శృంగభంగము జరుగుతుంది. సంఘ మౌళిక ఆశయము దెబ్బతింటుంది.

రానూ, రానూ వైశ్యసంఘాల నిర్వాహకులలో ఈ అహంకార వైఖరి ఎక్కువగుచున్నట్లుగా ఈ పత్రికకు అందే వార్తలవల్ల తెలుస్తూంది.

ఒకటి, రెండు ఆర్యవైశ్యసంఘాలవారు తాము నిర్ణయించిన రుసుమును ఇవ్వలేదని కొందరు సోదరవైశ్యులఇండ్లకు పౌరోహితులను పోకుండా చేసినట్లుగా తెలుస్తూంది. ఇటువంటి చర్య ఏ విధంగా శ్లాఘనీయముకాదు. చిలికి చిలికి గాలి వానగా మారి కడకు రెండవ ఆర్యవైశ్యసంఘము ఏర్పడే స్థితికి దారితీయవచ్చు. ఆర్యవైశ్యసంఘము - శ్రీ ఆర్యవైశ్యసంఘము అనికూడ కొన్నిచోట్ల ఆర్యవైశ్యసంఘాలు ఏర్పడడము ఇటువంటి అభిలషణీయము కాని సంఘనిర్వాహకుల చర్యలవల్లనే. అహంకార వైఖరివల్లనే.

పంచబ్రహ్మలు, సప్తవాయువులు, అష్ట వసువులు, దశదిశలు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు - అయా అధిష్ఠాన దేవతల కందరినీ కలశములలో అవాహన మొనర్చి అర్చించి, తిల దూర్వాంకు రాదులతో హోమం చేయవలెను.

అయుస్సూక్తము, మృత్యుసూక్తము, మున్నగు మంత్రములతో, కల శోదకములతో అభిషేకించి యజమానుని ఆశీర్వదించవలెను. యజమానుడు అచార్యులకు, ఋత్విక్కులకు సత్కారము చేయవలెను.

యజ్ఞానికి ఆజ్యమెంత ప్రధానమో దానము కూడ అంత ప్రధానమని చెపుతారు. దశవిధదానములు ప్రశస్తములు. అన్నిట కంటె ముఖ్యమైనది అన్నదానము. నిండుమనస్సుతో శక్తికొలది పూజలు, దానములు నిర్వహిస్తే ఉగ్రరథుడు శాంతించును. యజమానుడు దీర్ఘా యుష్కుడగును. ఇది శాస్త్రోక్త విధానం.

యజమానుడు ఏ శుభకార్యం జరి పించినా సహధర్మచారిణి వామభాగ మలంకరించి వుంటుంది. షష్టిపూర్తి శాంతి యజ్ఞంలోను పాలు పంచుకొంటుంది.

కొందరు షష్టిపూర్తి అంటే పునర్వి వాహమని, అలుమగలను పీటలమీద కూర్చుండబెట్టి పెండ్లిమంత్రాలు చదివి, మరల తాళి కట్టిస్తారు. ఇది తమాషా కొరకు చేయవలసిందే కాని శాస్త్రోక్తం కాదు. ప్రాత ఇంటికి సున్నం కొట్టించి, పచ్చతోరణం కట్టి గృహప్రవేశం చేస్తే ఆ యింటికి నూతనజీవకళ వస్తుందా?

60 ఏండ్లకు షష్టిపూర్తి ఉగ్రరథశాంతి చేసుకొంటారు. 70 ఏండ్లకు భీమరథశాంతి చేసుకొంటారు. 78 ఏండ్లకు విజయ రథశాంతి చేసుకొంటారు. ఇది సంప్ర దాయం.

సహస్రచంద్రదర్శనం చేసుకొన్న వారు, అంటే వెయ్యి నిండుపున్నమలను చూడనోచినవారు, శతసంవత్సరములు జీవించినవారు కూడా శాంతి చేసుకొనుట కద్దు. శతాభిషేకం చేసుకొన్న వ్యక్తి, రథమెక్కి, స్వస్తివాచనములతో, దుందుభి శబ్దపురస్సరముగా పురప్రదక్షిణం చేస్తే తాను పునీతుడై తనపూర్వులు పదితరముల వారిని, ఇక రాబోవు తన వంశీయులు పది తరములవారిని పునీతులను చేస్తాడని, పుత్రపౌత్ర పరంపరాభివృద్ధి కలిగి 60 వేల యేండ్లు స్వర్గసుఖ మనుభవించి, బ్రహ్మ సాయుజ్య సాలోక్య సిద్ధి పొందుతాడని బోధాయన భగవానుల సూక్తి.

ప్రస్తుతం షష్టిపూర్తి జరుపుకొంటున్న ప్రియమిత్రము శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి గారు ఆయురారోగ్యభాగ్యవంతులై సమాజ సేవ కావిస్తూ భీమరథశాంతి, విజయ రథశాంతి, సహస్రచంద్రదర్శన శతాయు శ్శాంతి కార్యక్రమములు క్రమంగా జరుపుకోవాలని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

*(సంపాదకుల షష్టిపూర్తి శాంత్యుత్సవ సంచిక "మహతి" నుండి)*

పంచబ్రహ్మలు, సప్తవాయువులు, అష్ట వసువులు, దశదిశలు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు - అయా అధిష్ఠాన దేవతల కందరినీ కలశములలో అవాహన మొనర్చి అర్చించి, తిల దూర్వాంకు రాదులతో హోమం చేయవలెను.

అయుస్సూక్తము, మృత్యుసూక్తము, మున్నగు మంత్రములతో, కలశోదకములతో అభిషేకించి యజమానుని ఆశీర్వదించవలెను. యజమానుడు అచార్యులకు, ఋత్విక్కులకు సత్కారము చేయవలెను.

యజ్ఞానికి ఆజ్యమెంత ప్రధానమో దానము కూడ అంత ప్రధానమని చెపుతారు. దశవిధదానములు ప్రశస్తములు. అన్నిటకంటె ముఖ్యమైనది అన్నదానము. నిండుమనస్సుతో శక్తికొలది పూజలు, దానములు నిర్వహిస్తే ఉగ్రరథుడు శాంతించును. యజమానుడు దీర్ఘాయుష్కుడగును. ఇది శాస్త్రోక్త విధానం.

యజమానుడు ఏ శుభకార్యం జరిపించినా సహధర్మచారిణి వామభాగమలంకరించి వుంటుంది. షష్టిపూర్తి శాంతి యజ్ఞంలోను పాలు పంచుకొంటుంది.

కొందరు షష్టిపూర్తి అంటే పునర్వివాహమని, అలుమగలను పీటలమీద కూర్చుండబెట్టి పెండ్లిమంత్రాలు చదివి, మరల తాళి కట్టిస్తారు. ఇది తమాషా కొరకు చేయవలసిందే కాని శాస్త్రోక్తం కాదు. ప్రాత ఇంటికి సున్నం కొట్టించి, పచ్చతోరణం కట్టి గృహప్రవేశం చేస్తే ఆ యింటికి నూతనజీవకళ వస్తుందా?

60 ఏండ్లకు షష్టిపూర్తి ఉగ్రరథశాంతి చేసుకొంటారు. 70 ఏండ్లకు భీమరథశాంతి చేసుకొంటారు. 78 ఏండ్లకు విజయ రథశాంతి చేసుకొంటారు. ఇది సంప్రదాయం.

సహస్రచంద్రదర్శనం చేసుకొన్నవారు, అంటే వెయ్యి నిండుపున్నమలను చూడనోచినవారు, శతసంవత్సరములు జీవించినవారు కూడా శాంతి చేసుకొనుట కద్దు. శతాభిషేకం చేసుకొన్న వ్యక్తి, రథమెక్కి, స్వస్తివాచనములతో, దుందుభి శబ్దపురస్సరముగా పురప్రదక్షిణం చేస్తే తాను పునీతుడై తనపూర్వులు పదితరముల వారిని, ఇక రాబోవు తన వంశీయులు పది తరములవారిని పునీతులను చేస్తాడని, పుత్రపౌత్ర పరంపరాభివృద్ధి కలిగి 60 వేల యేండ్లు స్వర్గసుఖ మనుభవించి, బ్రహ్మ సాయుజ్య సాలోక్య సిద్ధి పొందుతాడని బోధాయన భగవానుల సూక్తి.

ప్రస్తుతం షష్టిపూర్తి జరుపుకొంటున్న ప్రియమిత్రము శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి గారు ఆయురారోగ్యభాగ్యవంతులై సమాజ సేవ కావిస్తూ భీమరథశాంతి, విజయ రథశాంతి, సహస్రచంద్రదర్శన శతాయుశ్శాంతి కార్యక్రమములు క్రమంగా జరుపుకోవాలని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

*(సంపాదకుల షష్టిపూర్తి శాంత్యుత్సవ సంచిక "మహతి" నుండి)*

## రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్యకు సహస్రవందనాలు

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్యమహాసభ ఈనాడు - ఇంత ఉన్నతస్థితికి చేరు కొనుటకు - ఆదిలో కృషిచేసిన అతి కొద్దిమంది ముఖ్యుల్లో "సంఘోద్ధారక', 'వైశ్యభూషణ', 'సమాజసేవానిష్ణాత' మా తండ్రి శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారూ ఒకరు. రాష్ట్రమంతా స్వయంగా తిరిగి వైశ్యప్రబోధినికి చందాలు సేకరించి, స్వయంగా పత్రికను నడుపుకొనే శక్తి మహాసభకులేనపుడు - మహాసభకు శక్తికి మించి ప్రచారం చేశారు. విజయవాడ, వరంగలులలో జరిగిన సభలను విజయ వంతము చేయుటకు - తనకు ఏ పదవీ లేకున్నా పదిరోజులు అదేపనిలో ఉండి, అంతంతమాత్రంగా ఉన్న ఆనాటి మా ఆర్థికస్థితిని కూడ గమనించక కృషిచేశారు. అయినా ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్యమహాసభ మా నాన్నగారి కృషిని గుర్తించలేదు.

వాస్తవానికి, రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్య అభివృద్ధికి మా తండ్రిగారు చేసిన కృషి చాలా తక్కువ. అయినా రాష్ట్రవైశ్యసంస్థల సమాఖ్యవారు మా తండ్రిగారి షష్టిపూర్తి శాంతి సందర్భాన్ని పురస్కరించుకొని అదే పనిగా కడపకు వచ్చి 6-5-98వ తేదీన సభ జరిపి 'సమాజసేవారత్న' అను బిరుదును ఇచ్చి - ఘనంగా సత్కరించారు. వారికి మా కృతజ్ఞతలు.

పూజ్యులు సంఘశ్రీ కె.సి. గుప్త, రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్య అధ్యక్షులు 'పారిశ్రామికరత్న' శ్రీ గోపానరసింహులు, ప్రధానకార్యదర్శులు శ్రీ జి. వెంకటరమ ణయ్య, 'నిర్మాణరత్న' శ్రీ మేడానః సింహులుగారలు ఈ బిరుదప్రదాన అభినందన విషయములో ప్రత్యేక శ్రద్ధనూ విశేషశ్రమనూ తీసుకొని కార్యక్రమాన్ని ఘనంగా జరిపించి మా అందరినీ ఆనం దింపజేశారు. వీరికి మా సహస్రవందనాలు.

- **లయన్ పి.వి. రమేశ్**

**పి. భూపేశ్ గుప్త**

**పి. ఉమామహేశ్**

## వైశ్యప్రబోధినిని సాహిత్యమాసపత్రికగా తీర్చిదిద్దారు

మైత్రీసంపన్నుడు లక్ష్మీకాంతంగారు వైశ్యప్రబోధినీ సంపాదక బాధ్యతలు సమర్థవంతంగా నిర్వహిస్తూ షష్టిపూర్తి జరుపుకొంటున్నందుకు ఆనందంగా వుంది. ఆయన మిత్ర సంపన్నుడు. ఆంధ్ర ప్రదేశ్‌లోని సాహిత్యసాంస్కృతిక రాజకీయ కళారంగాలలోని ప్రసిద్ధులతో ప్రగాఢ పరిచయం వుంది. అయినా వారి మైత్రిని ఎన్నడూ స్వప్రయోజనాలకు వాడుకోలేదు.

వైశ్యసంస్థాగత కార్యక్రమాలపట్ల అవిరళ దీక్షతో నిరంతరం కార్యక్రమాలు నిర్విఘ్నంగా జరిపారు. వైశ్యప్రబోధినిని సాహిత్యమాసపత్రికగా తీర్చిదిద్దారు.

'శతాయుష్మాన్ భవ'

**డా॥ ఆర్. అనంతపద్మనాభరావు,** IBPS

స్టేషన్ డైరెక్టర్, న్యూఢిల్లీ.

వైశ్యప్రబోధిని, మే 1998

## రాధాకృష్ణయ్యగారి ఎనభై ఏండ్ల పండగ

పారిశ్రామికవేత్తలూ, ఆంధ్రప్రదేశ్‌ఆర్య వైశ్యమహాసభ మాజీఅధ్యక్షులూ శ్రీ కె. రాధాకృష్ణయ్యగారి యెనభైఏండ్ల పండగ 19-4-1998వ తేదీన - అనంతపురంపట్టణములోని లలితకళాపరిషత్‌లో అతి వైభవంగా జరిగింది. ఆంధ్రప్రదేశ్‌ఆర్యవైశ్య మహాసభ మాజీఅధ్యక్షులు శ్రీ జూటూరు వేమయ్యగారు ఈ సందర్భంగా జరిగిన సభకు అధ్యక్షత వహించారు. అమళ్ళదిన్నె గోపినాథ్‌గారు స్వాగతం పలికిన ఈ సభలో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్యమహాసభ అధ్యక్షులు శ్రీ జయంసుబ్రమణ్యంగారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

బృహత్‌ద్విసహస్రావధాని శ్రీ మాడుగులనాగఫణిశర్మ, డాక్టర్ గెల్లిసహదేవుడు, శ్రీ సముద్రాలలక్ష్మయ్య, శలాకరఘునాథ శర్మ ప్రభృతులు ఈ సభలో పాల్గొని రాధాకృష్ణయ్యగారి సేవాతత్పరతనూ, ధార్మికతనూ ప్రశంసించారు.

శ్రీ సర్వేశ్వరానందస్వాములవారు ఈ సభకు విచ్చేసి శ్రీ రాధాకృష్ణయ్యగారిని ఆశీర్వదించారు.

ఈ సందర్భాన్ని పురస్కరించుకొని శ్రీ రాధాకృష్ణయ్యగారి కుమార్తె శ్రీమతి శిఖాకొల్లి లక్ష్మీమోహన్ తాను వ్రాసిన శ్రీ రాధాకృష్ణయ్యగారి జీవితచరిత్రను రాధాకృష్ణయ్యగారికి అంకితమిచ్చారు.

ఈ సందర్భాన్ని పురస్కరించుకొని సాహిత్య ఆధ్యాత్మిక రాజకీయరంగాలలో సేవచేసిన పలువురు కవులనూ, పండితులనూ, రాజకీయనాయకులనూ శ్రీ రాధాకృష్ణయ్యగారు ఘనంగా సత్కరించారు.

అనంతపురం, తదితర సమీప పట్టణాలలోని 22 సంస్థలవారు శ్రీ రాధాకృష్ణయ్య గారిని సన్మానించారు.



# వైశ్య స్వాతంత్ర్యసమరయోధులసంఘము

ఆఫీసు : కె.సి. గుప్త, ఇం. నెం. 4-7-324,
ఇస్సామియా బజార్, హైద్రాబాద్ - 500 027.

## విజ్ఞప్తి

1. ఈ సంస్థను రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్య పక్షాన శ్రీ కె.సి. గుప్తగారు తేది 16 మార్చి 1998న ప్రారంభించారు.
2. ఈ సంస్థ ఆల్ ఇండియా వైశ్య ఫ్రీడం ఫైటర్సు అసోసియేషన్ పాట్నా, (బీహారు రాష్ట్రము) లో గల సంస్థకు అనుబంధ సంస్థగా ఉండి కృషి చేయును.
3. సర్కారు, రాయలసీమ జిల్లాలో వైశ్యులు దేశ స్వాతంత్ర్య ఉద్యమములో పాల్గొని జైలుకు వెళ్ళినవారు మరియు మాజీహైద్రాబాదురాష్ట్రములో, ప్రత్యేకముగా తెలంగాణాలోని వైశ్యులు, 1936లో స్టేటు కాంగ్రెసు పక్షాన సత్యాగ్రహము చేసిన వారు 1942లో క్విట్ ఇండియా ఉద్యమములో సత్యాగ్రహము చేసినవారు మరియు 1940 నుండి ప్రారంభమైనహైద్రాబాదువిమోచన పోరాటములో పాల్గొని 'డిటన్యూ'లుగా జైలుకు వెళ్ళినవారు ఈ సంస్థలో సభ్యులుగా చేరుటకు అర్హులు.
4. వైశ్యులు జైలుకు వెళ్ళలేదు కానీ స్వాతంత్ర్య ఉద్యమములో పాల్గొనినారు. వారిలో కొంతమంది కేంద్ర ప్రభుత్వముచే గుర్తింపు పొందిన వారు, గుర్తింపు పొందని వారు సంస్థలో చేరుటకు అర్హులు.
5. ఈ సంస్థ జీవితసభ్యత్వము 100/- రూపాయలు మాత్రమే 1000/- రూపాయలు ఆపైన విరాళము ఇచ్చు దాతలు 'పోషకులు'గా నుందురు.
6. ఈ సంస్థ యెడ అభిమానముగల వైశ్యులు 1000/- రూపాయలు ఆ పైన చెల్లించు వారు దాతలుగా నుందురు. వీరి పరిచయము ఫోటోతో సావనీరులో ముద్రించబడును.
7. ఇప్పటివరకు సుమారు 500 మంది స్వాతంత్ర్యసమరయోధుల పేర్లను సేకరించినాము. 100 మంది సంక్షిప్తపరిచయము ఫోటోతో ఒక్కొక్క పుస్తకముగా 5 పుస్తకాలు వెలువడును. ప్రథమ పుస్తకము జూన్ 1998లో వెలువడును.
8. 5 పుస్తకాలు మరియు సావనీరు ముద్రించుటకు ఒక లక్ష రూపాయలు వ్యయమగును. కాబట్టి స్వాతంత్ర్యసమరయోధుల సంక్షిప్తపరిచయము ఫోటోతో పాటు సభ్యత్వరుసుము మరియు విరాళములు పంపి ఈ కార్యక్రమము జయ ప్రదముగా జరుగుటకు తోడ్పడ కోరతాము.
9. జైలుకు వెళ్ళిన స్వాతంత్ర్య సమరయోధులు తమకు ఏ కోర్టులో శిక్షపడినది, ఎంత కాలముశిక్ష పడినది, ఏ జైలులో ఉన్నది, ఎంతకాలము ఉన్నది వివరముగా వ్రాసి పంపవలెను.
10. జైలుకు వెళ్ళని స్వాతంత్ర్యసమరయోధులు వారు చేసిన పని వివరములు, ఆ ప్రాంతము పేరు, తేది మొదలగు వివరములు వ్రాసి పంపవలెను.
11. వసూలైన డబ్బుననుసరించి పుస్తకాలు వెలువడును.

- గజవాడ మల్లయ్యగుప్త, నేతి బాల్‌రాజయ్యగుప్త
గోపిశెట్టి రాజేశ్వర్‌రావు, ఎలకంటి ఈశ్వరయ్య, కె.సిగుప్త

## 'సంఘోద్ధారక', 'సమాజసేవానిష్ణాత' శబ్దములు రెండూ సమానార్థ బోధకములే అని శ్రీ రమణయ్యగారు నోరుజారుట విచారకరము

ప్రియమయిన శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి గారికి నమస్కార కుశలోపరి. షష్టిపూర్తి సదస్సు వర్చస్వంతముగా జరిగినది. దేశము చతుర్దిశలనుండి దిగ్గజముల వంటి పెద్దలు వచ్చి దిగుట చరిత్రాత్మక సన్నివేశము. సభారంగము ఇంద్రసభ వలె శోభిల్లినది. మీ పుత్రరత్నము చి. రమేశ్‌గారి కృషి అడుగడుగున స్ఫురించినది. విద్యుత్ విచ్ఛేదముకాని, గాలివానకాని, సభలో అపశ్రుతికాని కలుగలేదు. ఇది మీ అదృష్టము.

శ్రీ జయంసుబ్రమణ్యంగారు - విమర్శను మిత్రహితోపదేశముగా భావింపవలెనని చక్కని ప్రసంగము చేసిరి. ఈ మాట, మీ విమర్శకు గుఱియై వైముఖ్యము పొందిన కొందరు పెద్దలను ఉద్దేశించి అన్నమాట అని చెప్పనక్కఱలేదు. ఇక మన రమణయ్యగారు, పండితుడ ననిపించుకొనవలెనని, 'సంఘోద్ధారక', 'సమాజసేవానిష్ణాత' శబ్దములు రెండూ సమానార్థబోధకములే అని నోరు జాఱిరి. నన్ను లేచి వివరింపుమని కొందరు పెద్దలు చెప్పిరి కాని, నేను మౌనము వహించితిని. కారణము - ఇపుడే ఆయన నాపట్ల ఆగ్రహముతో నున్నారు. సభలో ఖండించినచో రసాభాసమగునని మాటాడ లేదు.

'సంఘోద్ధారక' మునిగిపోవుచున్న సంఘమును ఉద్ధరించి చక్కగా నిలిపిన వాడు అని చెప్పవచ్చు. అది జరిగినది కనుక ఇక విశ్రమించవచ్చును. కాని, తన బాధ్యత తీఱినదని విశ్రమించి కూర్చుండక, సమాజసేవయందే మునిగితేలుచున్నాడు అనెడు అర్థము 'సమాజసేవానిష్ణాత' బిరుదమునందు కలదు. 'నిష్ణాతః కుశలే పారంగతే' అని శ్రీ మామిడివెంకయ్యగారి వివరణము. సమాజమునకు సేవ చేయుటయందు కుశలుడని, ఆ సేవ యందు పారము చూచినవాడని గంభీర మైన అర్థము స్ఫురించును. మీరు సమాజసేవానిష్ణాతులనుటకు షష్టిపూర్తి సభకు విజయంచేసిన అతిరథ మహారథ నాయకమణులే నిదర్శనము.

ఇక మాకిరువురకు చేసిన సత్కారము అమూల్యము. మాయెడ అపారమైన కూర్మిపేర్మి చూపుచున్నారు. మేము ధన్యులము.

నా ఆశీర్వచనములందు ప్రథమ శ్లోకము చతుర్థచరణమున శ్రేష్ఠే అని పడినది, అది 'శ్రేష్ఠీ' అని దిద్దవలెను.

నాకు ఇచ్చిన కన్యకాపురాణమును శ్రీ వెంకటరమణయ్యగారికిచ్చితిని. వారు మీ కృషి నభినందించిరి. ఫోటోలు చూచి సంతోషించిరి.

పూజ్యులగు మాతాపితలను కూర్చుండబెట్టి, సర్వకార్యనిర్వహణాభారమును వహించి, జగజ్జేగీయమానముగా సదస్సు నడిపించిన చిరంజీవి రమేశ్‌గారిని అభినందించని వారుండరు. అంతా దైవానుగ్రహము.

- డా. సి.వి.సుబ్బన్న శతావధాని,
8-6-98.

# సంపాదకుల షష్ట్యబ్దిశాంతి - "సమాజసేవానిష్ణాత" బిరుదప్రదాన ఉత్సవ విశేషాలు

ఈ వైశ్యప్రబోధినీ పత్రికాసంపాదకులు 'సంఘోద్ధారక', 'వైశ్యభూషణ', 'సమాజ సేవానిష్ణాత' శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి గారి షష్టిపూర్తి శాంతి కార్యక్రమాలు ఈ నెల (మే) 4, 5, 6వ తేదీలలో వారి స్వగృహమగు బ్రహ్మశ్రీ వెల్లాలవెంకటశేషయ్య, బ్రహ్మశ్రీ అయిలావఝులరామకృష్ణశాస్త్రి గారలు త్రయాహ్నికదీక్షతో సాగిన ఈ శాంతికార్య క్రమాలను నిర్వహించారు.

ఈ శాంతి కార్యక్రమాలలో భాగంగా



కడప జయనగర్‌కాలనీలోని 'వాసవీ భవన్' లో శాస్త్రోక్తంగా జరిగాయి.

సంపాదకుల కుమారులు లయన్ శ్రీ పి.వి. రమేశ్, శ్రీ పి. భూపేశ్‌గుప్త, శ్రీ పి. ఉమామహేశ్, అల్లుడు శ్రీ నామారవి కుమార్, బి.టెక్., గారలు ఈ శాంతి కార్య క్రమాలను జరిపించారు.

సంపాదకులు శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్ఠి, వీరి సతీమణి శ్రీమతి శివలక్ష్మమ్మ గారలు 'వాసవీ హోమము'ను చేయడం ఈ శాంతి కార్యక్రమాలలో ప్రత్యేకంగా గమనించ దగ్గది.

ఈ షష్ట్యబ్దిశాంతి సందర్భంగా హైద్రాబాద్ ప్రధానకార్యస్థానంగాగల 'రాష్ట్ర

వైశ్యసంస్థలసమాఖ్య' వారు కడపకు వచ్చి సంపాదకులకు 'సమాజసేవానిష్ణాత' అను బిరుదును ఇచ్చి శ్రేష్ఠిగారినీ, వారి సతీమణి శ్రీమతి శివలక్ష్మమ్మ గారలనూ ఘనంగా సత్కరించారు.

'బిరుద ప్రదాన - అభినందనసభను వాసవీభవనము ఎదుట గల విశాలప్రదేశములో ఏర్పాటు చేశారు. సభాస్థలిని సర్వమూ విద్యుద్దీపాలతో కన్నులకు విందు చేయునట్లుగా అలంకరించారు. వేదికను అతిరమణీయంగా విశాలంగా ఏర్పాటుచేశారు.

విద్యుత్‌కు ఆటంకముకానీ, గాలీ వానకానీ - అపశ్రుతులు కానీ లేకుండా సభ వడివడిగా క్రమబద్ధంగా సాగింది.

ఈ బిరుదప్రదాన - అభినందనసభకు రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్య ఆధ్యక్షులూ, అనంతపురం పట్టణప్రముఖులూ, 'పారిశ్రామికరత్న' శ్రీ గోపానరసింహులు గారు అధ్యక్షత వహించారు. విజయవాడ పట్టణ ప్రముఖులూ, శ్రీ భ్రమరాంభామల్లేశ్వర ఆంధ్రగ్రంథాలయసంఘం ప్రధానకార్యదర్శులూ 'సంఘోద్ధారక' శ్రీ కూరపాటికృష్ణమూర్తిగారు జ్యోతిని వెలిగించి సభను ప్రారంభించారు.

భాగ్యనగరప్రముఖులూ, ప్రసిద్ధకాంట్రాక్టర్లూ, రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్య మాజీ అధ్యక్షులూ 'నిర్మాణరత్న', 'సేవారత్నా'ది పలు బిరుదవిరాజితులూ, అనేక పురస్కారగ్రహీతలూ శ్రీ మేడానరసింహులు గారు 'సమాజసేవానిష్ణాత' అను బిరుదును శ్రేష్ఠిగారికి ఇచ్చి సత్కరించారు.

హైద్రాబాద్ నగరములోని 'ట్యాంక్ బండ్'పై గల తెలుగుకళామూర్తుల ప్రాంగణ నిర్మాణ కార్యభారాన్ని ప్రతిభావంతంగా నిర్వహించి, అప్పటి ముఖ్యమంత్రి శ్రీ యన్టీఆర్‌తో నీతి, నిజాయితీ, ప్రతిభ, దక్షతగల ప్రభుత్వోద్యోగి అని మిక్కిలి ప్రశంసలనందుకొన్న రాష్ట్రవైశ్య సంస్థల ప్రధానకార్యదర్శులు శ్రీ జి. వెంకటరమణయ్యగారు ఈ సభలో శ్రేష్ఠిగారికి సన్మానపత్రాన్ని సమర్పించారు.

సమాఖ్యఅధ్యక్షులు 'పారిశ్రామికరత్న' శ్రీ గోపానరసింహులుగారు రాష్ట్రవైశ్య సంస్థలసమాఖ్య తరపున లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారికీ వారి శ్రీమతి పి. శివలక్ష్మమ్మ గారికీ నూతనవస్త్రములు ఇచ్చి సత్కరించారు.

కడపపట్టణమూ, సమీప పట్టణాలకూ చెందిన పలువురు ప్రముఖులూ, విజయవాడ, హైద్రాబాద్ మొదలగు సుదూర ప్రాంతాలనుండీ వచ్చిన పలువురు నాయకులూ ఈ సందర్భాన్ని పురస్కరించుకొని శ్రీ లక్ష్మీకాంతంశ్రేష్ఠి, శ్రీమతి శివలక్ష్మమ్మ గారలను నూతన వస్త్రములను ఇచ్చీ, పుష్పమాలలు వేసీ ఘనంగా సన్మానించారు.

మచిలీపట్నం పురప్రముఖులూ, ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్యయువజనసంఘముల

సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్యమహాసభల మాజీఅధ్యక్షులూ, మచిలీపట్నంలోని శ్రీ అత్మూరిలక్ష్మీనృసింహసోమయాజి వైశ్య సమాజఅధ్యక్షులూ శ్రీ జి.వి. గున్నయ్యశ్రేష్ఠి, ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్యమహాసభ ప్రస్తుత అధ్యక్షులూ, అనంతపురంజిల్లా కల్యాణ దుర్గంపట్టణప్రముఖులూ శ్రీ జయంసుబ్ర మణ్యం, శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్యధర్మసంస్థల సమాఖ్య, ప్రొద్దుటూరుపురపాలక సంఘం అధ్యక్షులూ 'ప్రజాబంధు', 'దానశీల' బిరుదాంకితులూ శ్రీ కామిశెట్టిసుబ్బరావు గారలు ఈ సభలో విశిష్టఅతిథులుగా పాల్గొని, లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారు వైశ్యసమా జానికి చేసిన సేవలనూ - అక్షరరూప కృషినీ వివరించి ఈనాడు ఆర్యవైశ్యసభ ఇంత ఉన్నతస్థితిని చేరుకొనుటకు శ్రమించిన ముఖ్యుల్లో శ్రేష్ఠిగారూ ఒకరనీ, వైశ్యసమాజము వీరికి ఋణపడి ఉందనీ అన్నారు.

విజయవాడపురప్రముఖులూ - శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీదేవ్యాలయాలు, ఆర్యవైశ్యధర్మసంస్థలసమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ఉపాధ్యక్షులూ, విజయవాడలోని శ్రీ లక్ష్మీనారాయణస్వామి ఆర్యవైశ్యకల్యాణ మందిరసంఘాధ్యక్షులూ శ్రీ గడ్డంసుబ్బ రావు, ప్రొద్దుటూరుసర్వవర్తకసంఘాల సమాఖ్యఅధ్యక్షులు, శ్రీ వంకదారవీర భద్రయ్య, రాష్ట్రవైశ్యసంస్థలసమాఖ్యఉపా ధ్యక్షులూ, ప్రొద్దుటూరు వైశ్యప్రముఖులూ, కడపజిల్లా దూదిఉత్పత్తిదారులసంఘం అధ్యక్షులూ, 'వాణిజ్యరత్న' శ్రీ వల్లంకొండు సత్యనారాయణ గారలు ఈ సభలో ముఖ్య అతిథులుగా పాల్గొని శ్రేష్ఠిగారు వైశ్యసమా జానికి చేసిన కృషిని ఉగ్గడించారు.

ప్రొద్దుటూరుపట్టణప్రముఖులూ, శ్రీ దోమావెంకటస్వామిగుప్తసాహిత్యపీఠంఅధ్య క్షులూ, 'సాహితీబంధు' శ్రీ జూటూరు రమణయ్యగారు లక్ష్మీకాంతంశ్రేష్ఠిగారి షష్ట్యబ్దిశాంత్యుత్సవ సందర్భంగా ప్రచు రించిన ప్రత్యేకసంచిక 'మహతి'ని ఆవిష్క రించారు.

బ్రహ్మశ్రీవెల్లాలవెంకటశేషయ్య,బ్రహ్మశ్రీ అయిలావఝులరామకృష్ణశాస్త్రి గారలు శ్రేష్ఠి గారిని వేదమంత్రములతో ఆశీర్వదించారు.

కడపపట్టణప్రముఖులూ - కడపజిల్లా అవోపాఅధ్యక్షులూ శ్రీ కె. రామసుబ్బయ్య గారు శ్రేష్ఠిగారి కృషిని అభినందించి కడప అవోపా ఆవిర్భావం శ్రేష్ఠిగారి కృషిఫలితమే నన్నారు.

వేదపండితులు బ్రహ్మశ్రీవెల్లాలవెంకట శేషయ్య, ఆయుర్వేదాచార్య శ్రీ అయిలా వఝులరామకృష్ణశాస్త్రి, సాముద్రికవిద్యా ప్రవీణ శ్రీమతి బి. లక్ష్మీకాంతమ్మ, సరస్వతీ పుత్రులు డాక్టర్ శ్రీ సి.వి. సుబ్బన్న శతావ ధాని, అష్టావధానులు శ్రీ ఆశావాదిప్రకాశ రావు, ప్రసిద్ధఆడిటర్లు శ్రీ సి.కె. సంపత్ కుమార్, ప్రసిద్ధ న్యాయవాదులు శ్రీ పి. సీతారామయ్య, పత్రికారచయితలూ - ప్రముఖగ్రంథాలయసేవకులూ, "సాహితీ

ప్రపూర్ణ" శ్రీ జానమద్దిహనుమచ్ఛాస్త్రి, కడపఆకాశవాణీ కేంద్రనిర్దేశకులు, "జానపదహాస్యసంగీత పితా మహులు" శ్రీ ఆరవేటిశ్రీనివాసులు, జ్యోతిషశాస్త్రవేత్తలు శ్రీ శంకరానందస్వామి, లైన్సు క్లబ్ 324 - D3 జోనల్ ఛేర్మెన్ శ్రీ జనార్ధనపురాణిక, మార్వాడువాస్తవ్యులు, ప్రసిద్ధజ్యోతిష్కులు శ్రీ వి. రంగనాథాచార్యులు, శ్రీ ముడియం కిశోర్ గారలకు ఆయారంగాలలో వారు చేసిన సేవలకు గుర్తుగా శ్రేష్ఠిగారు వారి సతీమణి నూతన వస్త్రముల (పీతాంబరముల) తో గొప్పగా సత్కరించారు.

సభాకార్యక్రమములో పాల్గొన్న సభాధ్యక్షాది అతిథులందరినీ శ్రేష్ఠిదంపతులు నూతన వస్త్రములతో ఘనంగా గౌరవించారు.

అనంతపురంజిల్లాఆర్యవైశ్యసంఘం గౌరవాధ్యక్షులు శ్రీ కె. రామాంజనేయులు గారి వందనసమర్పణతో సభ సంపూర్ణమైంది.

సభాకార్యక్రమాల నిర్వహణలో చక్కని అనుభవంగల శ్రీ ముడియంకిశోర్‌గారు వేదికపైకి రావలసిన వారందరినీ ఆహ్వానించి, వారంతా చేసిన సమాజసేవనూ, వారికి గల బిరుదులనూ, చరిత్రనూ సభకు వివరించారు. చిరంజీవి శ్రీ టి.వి.యస్. ప్రకాశరావుగారు సభ ప్రారంభానికి ముందు ప్రార్థన చేశారు. శ్రీ పి.సుబ్బరాయుడు గారు సన్మానపత్రాన్ని కమ్మగా చదివి సభకు వినిపించారు.

సభానంతరము శ్రేష్ఠిగారి కుమారులు నాలుగువందలమందికి విందు భోజనం ఏర్పాటు చేశారు.

## శ్రీ లక్ష్మీనరసింహసోమయాజి వైశ్యసమాజంవారి ఆర్థికసహాయ తీర్మానాలు

కృష్ణాజిల్లా ముఖ్యపట్టణము మచిలీపట్నములోని శ్రీ లక్ష్మీనరసింహసోమయాజి వైశ్యసమాజంవారు సమాజఅధ్యక్షులు శ్రీ జి.వి. గున్నయ్యశ్రేష్ఠిగారి ఆధ్యక్షతన 11-4-1998వ తేదీన సమావేశమై తమ సమాజము నిర్వహిస్తున్న విద్యానిధి నుండీ 60 వేలు, పోషకనిధినుండీ 15 వేలు, వైద్యనిధినుండీ 15వేలు, వివాహనిధి నుండీ 15 వేలు, దహనసంస్కారాలనిధి నుండీ 15 వేలు వెరశి ఒకలక్షా ఇరవైవేల రూపాయలు 1998 - 99 సంవత్సరములో ఖర్చు చేయాలని తీర్మానించారు.

## మిట్టాకృష్ణమూర్తి - సుబ్రమణ్యం గార్లకు మాతృవియోగం

కడపజిల్లా పులివెందుల వైశ్యప్రముఖులు శ్రీ మిట్టాకృష్ణమూర్తి, సుబ్రమణ్యంగార్ల తల్లి శ్రీమతి తిరుపేలమ్మ గారు 13-4-1998వ తేదీన స్వర్గస్థులయ్యారు.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1998 మే 21 నుండీ 1998 జూన్ నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 24 | 31 | 7 | 14 | |
| సోమవారము | | 25 | జూన్ 1 | 8 | 15 | |
| మంగళవారము | | 26 | 2 | 9 | 16 | |
| బుధవారము | | 27 | 3 | 10 | 17 | |
| గురువారము | 21 | 28 | 4 | 11 | 18 | |
| శుక్రవారము | 22 | 29 | 5 | 12 | 19 | |
| శనివారము | 23 | 30 | 6 | 13 | 20 | |

మే 25 :- రోహిణీకార్తె రా క ప 2.25

మే 27 :- బుద్ధ, కల్కి జయంతులు

మే 28 :- డొల్లుకర్తరీత్యాగం

మే 31 :- 1997-98కు సంబంధించి లాటరీలు క్రాస్‌వర్డ్ పజిల్సులలో గెలుపొందిన వివరాలను తెలుపు ఆన్యువల్ రిటర్ను ఫారము నెం. 26B [illegible] సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేయుటకు చివరితేది.

ఫారము నెం. 26B, [illegible] సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి [illegible]

మే 31 :- 1997-98 ఆర్థిక సంవత్సరానికి సంబంధించిన గుఱ్ఱపు పందెములలో గెలుపొందిన వివరాలను తెలుపు ఆన్యువల్ రిటర్ను ఫారము నెం. 26B.B, ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు ఆఖరుతేది.

మే 31 :- 1998 ఏప్రెల్‌నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు కడపటిరోజు.

మే 31 :- పదవీవిరమణచేయు ఉద్యోగులకు 1998 ఏప్రెల్ నెలలో చెల్లించిన జీతమూ - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలనూ తెలుపు స్టేట్‌మెంటు ఫారము నెం. 21ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు చివరితారీఖు.

మే 31 :- 31-3-1998వ తేదీతో లెక్కలు ముగించిన అసెసీలు తాము రూ. 2500/- లకు మించి యుండి వడ్డీ ఖర్చు చేసినపుడు పట్టుకొన్న పన్ను మొత్తాన్ని 31-5-1998 వ తేదీలోగా ప్రభుత్వ ఖజానాలో జమ కట్టాలి.

మే 31 :- ఆదాయపుపన్నుచట్టములోని 192వ విభాగము క్రింద జీతములో పట్టుకొన్న వివరాలను తెలుపు 'ఆన్యువల్ రిటర్ను' అనగా 24వ నెంబరు పారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి చేర్చుటకు ఆఖరుతారీఖు.

జూన్ 8 :- మృగశిరకార్తె రాక ప 1-53

జూన్ 15 :- చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించువర్తకులు చెక్కుతోబాటు A-2రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరురోజు.

జూన్ 20 :- A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు చివరితారీఖు.

**24, 31, 7, 14 ఆదివారాలు**

- నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీ వాసవీ కన్యకాపురాణము

మూలం : వ్యాసప్రణీత స్కాంధపురాణం

స్వేచ్ఛానువాదము : శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి (సంపాదకులు)

(గతసంచిక తరువాయి)

కోటి మెరుపుల కాంతితో, మెరుపుతీగె వంటి దేహముతో, సమస్తదిక్కులూ నిండి సూర్యుడు, చంద్రుడు, అగ్నులతో సమాన మగు శరీరకాంతులతో రెండు భుజములతో, సుందరములైన కనుబొమ్మలతో, చిఱునగవుతో, తాటంకములతో ప్రకాశించు కపోలములతో, కిరీటములతో, హారములతో, భుజకీర్తులతో, మణులు దాపిన అందెలతో, బంగారు చీరెతో, వీణను వాయించు చేతులతో, చిలుకగల చేతితో, గొప్ప కన్నులతో ఆ వాసవి పరాదేవిగా కుసుమశ్రేష్ఠి ఎదుటనిలిచెను. ఆ రూపమును చూడలేకపోయెను. అది గమనించిన వాసవి కుసుమశ్రేష్ఠికి దివ్యదృష్టి ఇచ్చెను. అనంతరం కాంతిచే లోకములను వ్యాపించి ఉన్నదేవిని కుసుమశ్రేష్ఠి స్వేచ్ఛగా చూచి శిరస్సు వంచి మిక్కిలి స్తోత్రము చేసెను.

55 1/2 - 60 1/2 అ.38 - పుట 439

ఓం (మహాదేవి) నీకు నమస్కారము. లోకములతో పూజింపబడే (ఓ దేవి) నీకు నమస్కారము. ఓ పరమేశ్వరీ! నీకు నమస్కారము. ఓ విశ్వబాంధవీ! నీకు నమస్కారము. త్రిలోకమాతా! నీకు నమస్కారము. ఓ భక్తపాలనీ! నీకు నమస్కారము. ఓ జగదీశ్వరీ! సంసార సముద్రమున మున్గుచుండు మమ్ములను రక్షింపుము. ఓ తల్లీ! నీ ఈ రూపమును చూచుటకు నాకు శక్తిలేదు. ఉపసంహరించుము." - అని ప్రార్థించెను.

61 - 63 1/2 అ. 38 - పుట 439

అప్పుడు, ఆ వాసవీకన్యక సంతుష్టి పొంది, తండ్రిని చూచి, 'జరుగనున్న కార్యమును ఈ దివ్యదృష్టిచే చూడుము' అని పలికెను. అంత కుసుమశ్రేష్ఠికి జరుగబోవు అగ్నిప్రవేశము, విష్ణువర్ధనుని మరణము, విరూపాక్షుడు మొదలగు వైశ్యుల కాశీ యాత్ర, విరూపాక్షుని పట్టాభిషేకము కనిపించెను. చేతి లోని ఉసిరిక పండువలె ఆ సర్వమునూ చూచి, ఆశ్చర్యముతో కూడిన మనస్సుతో తన హృదయమునందు పరమానందము పొందెను.

64 - 67 అ.38 - పుట 441

ఇది స్కాంధపురాణమునందు సనత్సుజాతీయసంహితగల ఉత్తరఖండము - వాసవీదివ్యరూప సందర్శన - 17వ అశ్వాసము.

## పదునెనిమిదవ అధ్యాయము

సాలంకాయన మునిచంద్రులు తిరిగి ఇట్లు చెప్పెను.

వాసవి, కుసుమగుప్తుడు, కుసుమాంబలతో బాటు నూట రెండు గోత్రాలకు చెందిన

వారు మాఘశుద్ధ విదియన ఆత్మార్పణ చేయుటకు నిశ్చయించిరి కదా? వెంటనే కుసుమశ్రేష్ఠి గురువు భాస్కరాచార్యుని పిలిచి, బాలనగరులకు ధర్మములను బోధించుము అనెను. భాస్కరాచార్యులు బాలనగరులకు ధర్మబోధన ప్రారంభించి, పుష్యబహుళ అమావాస్యరోజున ధర్మము లను బోధించుటను పూర్తిచేసెను.

మాఘశుద్ధపాడ్యమిన, "మేము మా అనుంగు కుమార్తెతో రేపటి ఉదయం వర్ణాశ్రమాచార ధర్మసంరక్షణకై ఆత్మార్పణ చేస్తున్నాము. ఓపిక ఉన్న వారందరూ ఆ ఆత్మార్పణలో పాల్గొనవచ్చు. ఇందులో బలవంతము లేదు. ఇతర ఆలోచనలు వద్దు". - అని తన చారులచే తిరిగి పద్దెనిమిది పట్టణాల ప్రభువులకూ, నూట రెండు గోత్రీకులకూ వార్తలు పంపెను.

మాఘశుద్ధవిదియ. బాలభాస్కరుని లేత కిరణాలతో పుడమి అంతా బంగారు వర్ణంగా కన్పిస్తూ ఉంది. భారతభూమి చరిత్రలోనే అపూర్వంగా జరుగనున్న ఆ ఆత్మార్పణమును తిలకించుటకు దేవతలు ఆకాశముపై వచ్చి బారులు, బారులుగా కొలవుదీరారు. సమయ సూచకంగా శంఖము మ్రోగింది. శాస్త్రప్రకారము నూట రెండు అగ్నిగుండములు వెలిగించబడినవి. తమ ప్రభువు, ఆయన కులము వారూ చేస్తున్న ఆత్మార్పణను తిలకించుటకు పల్లెపట్టుల నుండీ, పట్టణాలనుండీ జనం పెనుగొండ పట్టణానికి చేరుకొన్నారు.

ద్వ్యుత్తర శతగోత్రీయులైన వైశ్యులు, వాసవి అగ్నిగుండములో దూకిరి. పది దిక్కులా నాలుకలను చాస్తూ ప్రచండంగా మండుచున్న ఆ గుండములోని అగ్ని ఒక్కసారిగా చల్లబడింది. అది చూచి, ఆకాశమున ఉన్న దేవతలూ, భూమిపై ఉన్న మానవులూ ఆశ్చర్యపడిరి.

అప్పుడు కుసుమగుప్తుడు అగ్నిదేవా! అజ్ఞానము, అంధకారమునకు నిల యమూ, నీచకామ భావనలతో నిత్యనూత నమూ అగుచున్న విష్ణువర్ధనుని మనః ప్రవృత్తిలో మార్పును తేవాలి అనే మేమంతా ఈ మరణాన్ని ఆనందముతో ఆహ్వానిస్తు న్నాము. మునుపు సీతాదేవి కూడా నీలో కురికింది. అయితే, ఆనాడు ఆమె భర్త రామచంద్రప్రభువు కోరిక మేరకు నీలో దూకింది. కానీ మా వాసవి అలా కాదు. తనకు తానుగా ఈ మరణాన్ని ఆహ్వానిస్తూ ఉంది. ఆమెవెంబడి మేమూ ఆత్మార్పణ చేస్తున్నాము. దేవతలకు హవ్యభాగము నీ ద్వారానే చెందుతుంది. మేము కూడ నీ ద్వారానే ఈ ఆత్మార్పణను చేస్తున్నాము. ఎందుకు నీవు, నీ ఉగ్రరూపాన్ని ఉపసంహరించుకొని, చల్లబడిపోయావు. మాలో ఏదైనా లోపము ఉందా? అని పలికెను.

"మహారాజా! మీరు సాధుశీలురు. నిత్యమునూ సత్యమునే పలుకువారలు. నిర్మలమైన అంతఃకరణము కలవారలు. ధర్మమార్గమున చరిస్తారు. ఎవరికీ ఏ విధమైన కీడునూ చేయని వారలు. ఎవరి

మనస్సునూ నొప్పించినవారలు. సాక్షాత్తూ ఆదిశక్తినే మీ బిడ్డగా పొందినారు. ఇంతటి పవిత్రులైన మిమ్ములను దహించి పాపిని కాజాలను. పూర్వము భృగుపత్ని కారణంగా సాధుశీలుడగు ఆ మునిచే శపింపబడి సర్వభక్షకుడను అయ్యాను. ఇంతమంది సాధుశీలురను దహించి, ఘోరమైన పాపాన్ని తెచ్చుకోలేను". అగ్నిదేవుడు జవాబు చెప్పాడు.

అప్పుడు వాసవి "అగ్నిదేవా! ఇది జగదంబ కన్యకాపరమేశ్వరీసంకల్పము.మేము స్వచ్ఛందంగా మృత్యువును ఆహ్వానిస్తున్నాము. అనంతమైన పుణ్యమును కలిగించు నీ ద్వారా వీరంతా క్షణభంగురములైన వారి శరీరాలను త్యాగం చేయాలనుకున్నారు. నీ ప్రచండరూపాన్ని ప్రదర్శించు. వేయినాలికలు చాచి నాతో కూడ వీరందరినీ దహించు. ఇందువలన నీకు ఎట్టిపాపము చెందదు. నా మాటలను నమ్ముము" అని పలికింది.

అయినప్పటికీ అగ్ని భీకరమైన తన రూపాన్ని ఆవిష్కరించలేదు.

స్వాహానాథా! ఆలోచించకుము. వీరి కోర్కెను మన్నించు. ఇది నా సంకల్పముతోనే జరుగుచున్నది. హింసతో కాక అహింసాయుతమైన శాంతి సత్యాగ్రహము ద్వారా ధర్మప్రతిష్ఠాపన చేయుటకై చేస్తున్న నా నూతన ప్రయోగము. వీరిని దహించినందున నీకు ఏ పాపమూ అంటదు. వీరి త్యాగము కూడ వృధాకాదు. 'హింస' అనే ప్రవృత్తివల్ల కన్నులు మూసుకపోయిన వ్యక్తుల, పవిత్రమైన వర్ణాశ్రమాచార ధర్మములకు ఆటంకము కలిగించాలి అనే మదాంధుల కన్నులనూ తెరిపిస్తుంది. అంధకారబంధురంగా ఉన్న ఈ ప్రపంచములో అహింసాజ్యోతి వెలుగును. చీకటులను పారద్రోలును. సంశయించక నీ కర్తవ్యాన్ని నెరవేర్చు". - ఈ మాటలు ఆకాశము నుండీ వినిపించాయి.

ప్రజలంతా ఆకాశము వైపు చూచారు. చంద్రుని తలలో పూవుగా పెట్టుకొని, కనకాంబరము రంగుగల చీరెను కట్టుకొని, అదే రంగుగల రవికెను ధరించి, వరద, అభయహస్తాలతో చిరునవ్వులు చిందిస్తూ జగదాంబ శ్రీ కన్యకాంబవారికి కనిపించింది.

"ప్రజలారా! ఆశ్చర్యపడకండి. నేనే మీ వాసవిని. ఈ కుసుమగుప్తుడు పూర్వజన్మమున కుబేరుడు. వీరి ప్రాణత్యాగము చరిత్రలో శాశ్వతంగా నిలుచును. రానున్న కాలములో ఈ భారతదేశము యొక్క కీర్తిచంద్రకలకు వీరి ఈ త్యాగఫలము ఆయువుపట్టుగా నిలుచును. వాసవి ప్రథమత్యాగ్రహి. భారతదేశానికి తెల్లదొరల వలన కలుగు దాస్యము అను శృంఖలమును త్రెంచుటకు ఈనాటి ఈ రక్తరహితశాంతి సత్యాగ్రహము ఎంతగానో ఉపకరించును. ఈ దాస్యశృంఖలములను ఛేదించుటకు తిరిగి వైశ్యకులమునుండే ఒక మహాపురుషుడు పుట్టాడు. ఇకముందు కన్యకాపరమేశ్వరిగా కాక శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీదేవిగా నేను పూజింపపడు

తాను. భక్తి ప్రపత్తి కలిగి నన్ను పూజించిన వారికి అయుస్సుకూ, ఆరోగ్యమునకూ, ఐశ్వర్యమునకూ కొఱతే ఉండదు. నియముతోనూ నిష్ఠతోనూ నన్ను ఉద్దేశించి, నా నామములతో అర్చించిన వారికి నేనే సమస్త సంపదలు, సుఖమూ, శాంతీ, సౌభాగ్యములను ప్రసాదిస్తాను. నన్ను ఆరాధించవలసిన రూపమునూ, తీరునూ వివరిస్తాను.

వరద, అభయముద్రనూ, చంద్రుడు సిగపూవుగానూ, చిరునగవులు చిందే సుందరవదనమునూ కలిగి నిలబడి ఉండే రూపములోనే నన్ను మీరు ఆరాధించాలి. అట్టి ఆ రూపమునకు జరిగే పూజలనూ, అర్చనలనూ మాత్రమే నేను స్వీకరిస్తాను.

నన్ను భక్తిచే పూజించునట్టి వైశ్యోత్తమునకు నేను సర్వకాలములందు సంపూర్ణమగు సంపదలను ఇచ్చుచున్నాను. వివాహములందునూ, వనప్రదేశములందునూ, సకలాలయాలందునూ, కలశములోనికి ఆవాహనచేసియూ నామూర్తిని (పైన చెప్పిన మూర్తిని) అర్చింపవలెను. ఎవరు నన్ను ఇట్లు పూజింపరో అట్టి వారి ధనమును నాశనము చేయుచున్నాను. కులదేవతనగు నన్ను ఈ భూలోకమునందు దుర్మదులై ఎవరు ద్వేషించెదరో అట్టి వారి సంపదనూ, ఆయుస్సునూ, నేను హరిస్తున్నాను. సందేహములేదు. కులదేవతనగు నన్ను అర్చింపక బ్రహ్మ, విష్ణువు, మొదలగు దేవలను ఎవ్వరిని కానీ అర్చించినప్పటికినీ సుఖము కలుగదు. అందువలన సకల ప్రయత్నములచేత నన్ను ఆరాధించుచుండెడు భక్తులను నేను కాపాడుచున్నాను. ఇది నా ప్రతిజ్ఞ. సత్యము పలుకుచున్నాను.

పుట 567 - 61 1/2 - 66 1/2

ఆర్యులారా! మీకు భద్రమగుగాక. సాంగమూ, సపావరణమూ, సమంత్రకమూ అగు నా పూజాక్రమమును నేను చెప్పుచున్నాను. వినుడు. మొదట 'ఓం' అను ప్రణవాక్షరములు మూడునూ, (అ+ఉ+మ్) తర్వాత మహామాయాబీజమగు ఒక అక్షరమునూ, బ్రహ్మ బీజమగు ఒక అక్షరమును, చంద్ర బీజమగు ఒక అక్షరమును అమృతబీజమగు ఒక అక్షరమును ఉంచి, అపైని "వాసవీకన్యకేమహ్యాం సర్వ సౌభాగ్యం దేహి దేహి" అను పదియేడు అక్షరములను, ఆ తర్వాత 'స్వాహా' అను రెండక్షరములనూ మొత్తము ఇరవైఆరు అక్షరములను కూర్చిన నా మంత్రము అగును. మంత్రములలోకెల్లా శ్రేష్ఠమైన ఈ నా మంత్రమును ఏ వైశ్యులు జపించెదరో వారికి సర్వసంపదలూ, సత్సంతానమూ, సౌభాగ్యమూ తప్పక లభించును.

32 1/2, 36 1/2 అ.50 - పుట 623.

ఈ మంత్రమునకు సమాధి ఋషి. చదస్సు జగతి. అమృతనామముబీజము. శక్తి చరమపదము., కీలకము . సౌభాగ్యము ఓ పుత్రకులారా! మీరు అంగన్యాస కరనాస్యాసాది పూర్వకముగా ఈ మంత్రమును జపింపుడు.

37 - 38 1/2 అ.50 - పుట 623

(ఇంకావుంది)

# నెల్లూరుజిల్లాను అమరజీవి-జిల్లాగా మార్చేందుకు సి.యం. సానుకూలం

'నెల్లూరుజిల్లాను అమరజీవి జిల్లాగా మార్చాలి' - అని దాదాపు 15 సంవత్స రాలుగా వైశ్యసంఘాలు ఆయా కాలాలలో ఉన్న ముఖ్యమంత్రులను కోరుచూనే ఉన్నాయి.

శ్రీ పెండేకంటివెంకటసుబ్బయ్యగారు సజీవులుగా ఉన్నపుడు కూడ ఈ ప్రయత్నం జరిగింది. అందుకు సహకరించమని అయన్ను అడగడమూ జరిగింది. 'శ్రీరాములుగారు వైశ్యులకు మాత్రమే అరాధ్యనీయుడుకారు. ఆయన ప్రాణ త్యాగ ఫలితమే ఈ విశాల ఆంధ్రప్రదేశ్. అందువల్ల వైశ్యులూ, వైశ్యేతరులూ కలిసి ప్రయత్నిస్తేనే అది సాధ్యమౌతుంది. ఆ ప్రయత్నం చేయండి. శ్రీరాములు గార్ని కేవలం వైశ్యులకే పరిమితం చేయ వద్దు' అనికూడ శ్రీ వెంకటసుబ్బయ్యగారు సలహాయిచ్చారు.

అయితే, వైశ్యసంఘనిర్వాహకులు ఎవరికివారు ప్రకటనలు ఇచ్చేందుకే పరిమితమయ్యారే కానీ శ్రీ పెండేకంటిగారి సూచనలను గుర్తుపెట్టుకొని నిర్మాణాత్మ కంగా కృషి చేయాలనుకోలేదు 'ఆ ఘన తంతా తమకే రావాలి ఇతరులకు రాకూడదు' - అనే భావమే ఆ ప్రయ త్నము వెనుక కన్పిస్తూందే కానీ కార్య సాధన మీద లక్ష్యం కనిపించుటలేదు. శ్రీ సి.సి. సుబ్బరాయుడుగారు ఆ కార్యాన్ని సక్రమ మైన పద్ధతిలో ఈమధ్య చేపట్టారు.

శ్రీ సుబ్బరాయుడుగారు నెల్లూరు పురప్రముఖులు. ధైర్యమూ - సాహసమూ - కార్యదీక్ష కలవారు. నెల్లూరుపట్టణము లోని సర్వోదయకాలేజి ఈనాడు ఇంత ఉన్నతస్థితికి చేరుకొనుటకు శ్రీ సుబ్బ రాయుడు గారి నిర్విరామకృషీ, కార్యదీక్షే కారణము.

నెల్లూరుజిల్లాను అమరజీవి జిల్లాగా మార్పించుటకు కృషిచేయుటకై శ్రీ సుబ్బ రాయుడుగారు "అమరజీవి శ్రీరాముల నెల్లూరుజిల్లా ఆశయసాధన కమిటి"ని ఏర్పాటు చేశారు. ఆచార్య పి.సి. రెడ్డిగారు ఈ సమితికి గౌరవాధ్యక్షులుగా, తాను అధ్యక్షులుగా ఉంటూ మరికొందరు వైశ్యసోదరులు, వైశ్యేతరులతో ఒక పెద్ద కార్యవర్గాన్ని ఏర్పాటు చేసి కార్యక్రమాన్ని ప్రారం భించారు.

ఈ ప్రయత్నములో భాగంగా శ్రీ సుబ్బ రాయుడుగారు గత ఏప్రెల్ నెల 10వ తారీఖున ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబునాయుడుగారిని కలిసి నెల్లూరు జిల్లాను అమరజీవిజిల్లాగా మార్చమని కోరుచూ విజ్ఞప్తి పత్రాన్ని సమర్పించారు. అందుకు ముఖ్యమంత్రి అనుకూలంగా స్పందించి, ఇటువంటివే ఇంకా రెండు, మూడు నా మనస్సులో ఉన్నవనీ, చేసేం దుకు ప్రయత్నిస్తానని హామీ ఇచ్చారు. మాజీమంత్రి తాళ్ళపాకరమేశ్‌రెడ్డిగారు శ్రీ సుబ్బరాయుడు గారి వెంట ముఖ్యమంత్రి వద్దకు వెళ్ళి నెల్లూరుజిల్లాను అమరజీవి జిల్లాగా మార్చవలసిన ఆవశ్యకతను నొక్కి చెప్పారు.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

(రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)

టెలిగ్రాం అన్నిచోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. - శ్రీశైలం : 87140, 87114
తిరుపతి : 50030, పుట్టపర్తి : 87240, 87440,
తిరుమల : 77682, 79327

## వైశ్య యాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

### 1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.35000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక 10 రోజులు దాతకు రూము కేటాయించబడును.

12×12 రూముకు రూ.50000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

### 2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. రూ. 50,000 సమర్పించిన 15×9 సైజుగల రూము దాతఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.35000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక 10రోజులు రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫోటో వేయబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక బీముకు ఒక సైడు పేరు, ఫోటో వేయబడును. లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 15 రోజులు రూము యివ్వబడును. కొద్దిమందికి మాత్రమే అవకాశము.

రు.2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥నకు 3 రోజులు రూము ఇవ్వబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు ఉభయం జరుపబడును.

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, తాత్కాలికముగా వసతులు ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

### వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. పోటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించబడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. పోటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును.

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును.

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు.35000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 10 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును. తిరుమలలో కూడా కొద్దిమందికి రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ పంచమ మహా క్రతువు పై క్రతువు జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును - మొదటి రోజు శ్రీమన్నారాయణుడు దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు, మూడవరోజు అష్టలక్ష్మి క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువు ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ క్రతువు, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 2 నుండి 7 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష దీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటివారు ఉచితముగా యివ్వగలరు.

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది.

రాబోవు క్రతువు హైద్రాబాద్‌లో చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

ప్రెసిడెంటు, వాసవీ సత్ర సముదాయ కమిటీ, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B.** : పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని అయా సత్రములకు పంపకోర్తాము. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

## సెల్ఫ్ అసెస్‌మెంటు సౌకర్యాన్ని పొందాలనుకొంటున్నారా? ఇలా చేయండి

మన రాష్ట్రప్రభుత్వము ఇప్పుడు అమలులో ఉన్న ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకం పన్నుచట్టము 1957ను సవరించుట ద్వారా 1998-99 అసెస్‌మెంట్ సంవత్సరము నుండీ అమలుకు వచ్చునట్లుగా సెల్ఫ్‌అసెస్‌మెంట్ పద్ధతిని ప్రవేశపెట్టింది

పదిలక్షలు అంతకులోపు టర్నోవర్‌గల వర్తకులు ఈ సెల్ఫ్‌అసెస్‌మెంట్ సౌలభ్యాన్ని పొందవచ్చు.

31-3-1998తో అంతమగు ఆర్థికసంవత్సరము అనగా 1-4-1997తో ప్రారంభమై 31-3-1998తో అంతమగు ఆర్థిక సంవత్సరములో తమ సంవత్సరటర్నోవర్ పది (10) లక్షలకు మించని వర్తకులు ఈ నెల (మే) 30వ తేదీలోగా తమ టర్నోవరు వివరాలను అందుకొఱకు నిర్దుష్టపరచిన ఫారములో చూపించి తమకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారివద్ద ఆ ఫారాన్ని దాఖలుచేసి పన్నును చెల్లించి రసీదు పొందాలి.

మే నెల 30వ తేదీ తర్వాత దాఖలు చేసిన యెడల రోజుకు రూ. 100/- ప్రకారం ఎన్ని రోజులు ఆలస్యమైతే అన్ని వందల రూపాయలు చెల్లించాల్సి ఉంటుంది.

- ఆదాయపుపన్నుచట్టము

## శాశ్వత అకౌంటు నెంబరును పొందుటకు జూన్ 30 లోగా దరఖాస్తుచేయాలి.

సెంట్రల్‌బోర్డు ఆఫ్ డైరెక్టుట్యాక్సెస్‌వారు 28-4-1998వ తేదీన ఎస్.ఒ. 354 (ఇ) నెంబరుతో ఒక నోటిఫికేషనును విడుదల చేశారు. ఈ నోటిఫికేషను ప్రకారమూ, 1997-98 సంవత్సరమునకు ఆదాయపుపన్ను విధింపబడినవారూ, ఆదాయపుపన్ను విధింపు పరిధిలోనికి వచ్చువారూ, అనగా 1997-98 సంవత్సరములో 40 వేలకు మించి, ఆదాయము కలవారూ, 50 వేల టర్నోవరు గలవారూ రానున్న (జూన్) నెల 30వ తేదీ (30-6-1998)-లోగా తమకు సంబంధించిన ఆదాయపుపన్నుశాఖాధికారికి తమ దరఖాస్తును రెండు కాపీలు (డూప్లికేటు)గా పంపుకోవాలి.

ఈ దరఖాస్తును ఇందుకొఱకు ప్రత్యేకముగా రూపొందించిన ఫారము 49A ను పూరించుటద్వారా పంపాలి. 3.5 × 2.5 సెంటీమీటర్ల కొలతలుగల అసెసీ యొక్క నలుపు తెలుపు (బ్లాక్ అండ్ వైట్) గల ఫోటోలు రెండింటిని ఆ దరఖాస్తునకు జత పరచాలి.

ఇంతకుమునుపే, శాశ్వతఅకౌంటునెంబరును పొందినవారు కూడ తిరిగి పై నోటిఫికేషను మేరకు శాశ్వతఅకౌంటునెంబరును పొందవలసి ఉంది.

# వైదిక రాజ్యపరిపాలనా విధానము

శ్రీ చుండూరు శ్రీహరిరావు - గుంటూరు

నిరాకార ఏకైకపరమేశ్వరుడు రుద్రుడనీ పిలువబడుతాడు. రుద్రుడు - రోదయతి ఇతి రుద్రః - రుద్రుడనగా దుష్టులను, పాపులను సద్వర్తనులుగా తీర్చిదిద్దుటకై వారి దుష్కర్మలకు శిక్షలననుభవింప చేయుచూ రోదింపచేయువాడు అనగా ఏడ్పించువాడు. ఈశ్వరుడు యజుర్వేదము లోని రుద్రాధ్యాయములో రాజ్యపాలనను దుష్టశిక్షణను గురించి ఇట్లు ఉపదేశించి యున్నాడు.

రాజు (లేక అధ్యక్షుడు, ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి); మహా విద్వాంసులతో కూడిన విద్యాసభ; ధార్మిక విద్వాంసులు గల ధర్మసభ (న్యాయవ్యవస్థ); ధార్మిక పురుషులు గల రాజ్యసభ; ప్రజలు; ఇవి అయిదువ్యవస్థలుండవలెను. ప్రతి వ్యవస్థ మిగతా వ్యవస్థలకు లోబడియుండవలయును. ఈ మూడుసభల ద్వారా ప్రజా పాలన చేయవలసిన రాజు, మంత్రులు పరిపాలకులు, ఉద్యోగులుగా ఎన్నిక చేయబడువారు, వీరిని ఎన్నిక చేయవలసిన ప్రజలు (ఓటుహక్కుగలవారు) ఎల్లరున్నూ వేదవిదులు, జితేంద్రియులు, జ్ఞానులు, విద్యావంతులు, సత్యవాదులు, ధర్మాచరణులు, సప్తవ్యసనములకు లోబడనివారుగను, స్వవృత్తులయందు నిపుణులుగను ఉండవలెను. ఇట్లు ఉత్తమమానవులు ఈ మూడు సభలకు పరిపాలకులను (యం.యల్.ఏ.లను, యం.పి.లను) శ్రేష్ఠులను ఎన్నుకొనవలెను ఈ పరిపాలకులు న్యాయవ్యవస్థ దండనవ్యవస్థల ద్వారా దుష్టులను పాపులను శిక్షించవలయును. వీరినుండి శిక్షలను తప్పించుకున్నవాడు ఈశ్వరవ్యవస్థ ననుసరించి మానవేతర జన్మలలో శిక్షలననుభవింపక తప్పదు.

ఏకో పివేద విద్ధర్మం యం వ్యవస్యే ద్విజోత్తమః ।
స విజ్ఞేయం పరోధర్మో నాజ్ఞానా ముదితో యుతైః ॥ .....మనుస్మృతి
- ౧౨ - ౧౧౩

భావము : వేదమెరిగిన వాడొక్క ఉత్తమ ద్విజుడు ధర్మము చెప్పినను దానినే పరమ ధర్మముగా న్యాయముగా నంగీకరింప వలయును. వెయ్యిమంది మూర్ఖులు చెప్పినను అది ధర్మముకాదు.

శిక్షించురీతి : చౌర్యము, వ్యభిచారము, కొట్లాటలు - ఇట్టి నేరములయందు సాక్షములతో పనిలేదు. ఏలయన ఇట్టి నేరములలో సాక్ష్యములు లభించుట దుర్లభము. అసత్యమును చెప్పిన సాక్షులనూ శిక్షింపవలయును.

సాక్షే నృతం వదన్ పాశైర్బద్ధ్యతే వరుణైర్భృశమ్ ।
వినశః శతమా జాతి స్తస్మాత్సాక్ష్యం వదే దృతమ్ ॥ ......మనుస్మృతి - ౮ - ౮౨

భావము : సాక్ష్యము చెప్పునపుడబద్ధ మాడినచో, ఈశ్వరుని దండరూప నియ

మముల చేత బంధింపబడును. వివశుడై వందజన్మలవరకు బాధపడును. అనగా భగవంతుడు శిక్షననుభవింపచేయును. తప్పించుకొనుటకు వీలులేదు. అందుచేత సత్యమైన సాక్ష్యమును చెప్పవలయును.

స్త్రీణాం సాక్ష్యం స్త్రియః కుర్యుః ద్విజానాం సదృశా ద్విజాః ।

శూద్రాశ్చ సంతః శూద్రాణా మంత్యానా మంత్యయోనయః ...మనుస్మృతి -౮-౬౮

భావము : స్త్రీలకు స్త్రీలు, ద్విజులకు సదృశులైన ద్విజులు, శూద్రులకు సజ్జన శూద్రులు, చాండాలురకు చాండాలురు సాక్షులుగా నుండవలయును.

యేయే అవయవములతో నేరము చేసిన దోషి యొక్క ఆయా అవయవములను ఛేదింపవలయును.

అంగులీర్గ్రంథి భేదస్య ఛేదయేత్ ప్రథమే గ్రహే ।

ద్వితీయే హస్తచరణౌ తృతయే వధమర్హతి ॥ .... మనుస్మృతి -౬-౭౭

భావము : ప్రథమముగా దొంగతనము చేసిన దొంగలను చేతివ్రేళ్ళను, రెండవసారి హస్తపాదములను, మూడవసారియైనచో వధించుటను చేయవలెను.

కోష్ఠాగారాయుధాగార దేవతాగార భేదకాన్ ।

హస్త్యశ్వరథ హర్త్యాంశ్చ హన్యాదేవా విచారయన్ ॥మనుస్మృతి -౬-౭౮

భావము : ప్రభుత్వమువారి ఖజానాను, ఆయుధాగారములను, యజ్ఞశాలలను భేదించువారికీ, ఏనుగు- గుఱ్ఱము రథము (వాహనము) మొదలగు వానిని దొంగలించువారికీ నిస్సంకోచముగా ప్రాణదండన విధించవలెను.

గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్ ।

ఆతతాయిన మాయన్తం హన్యాదేవా విచారయన్ ॥ .....మనుస్మృతి -౮-౩౫౦

భావము : శస్త్రము, చేతబట్టి చంపుటకు వచ్చిన ఆతతాయిని, అతడు గురువైనను, బాలుడైను, వృద్ధుడైనను, శాస్త్రములు చదివిన బ్రాహ్మణుడైనను మంచి చెడు లాలోచింపక రాజాతనిని చంపవలెను

ఒకేవిధమైన నేరము చేసిన దోషులలో తక్కువ ధనము జ్ఞానము అధికారము గల దోషిని తక్కువగాను; ధనము, జ్ఞానము అధికారము ఎన్నిరెట్లు ఎక్కువగాగల దోషిని అన్నిరెట్లు ఎక్కువగానూ శిక్షించవలెను. అనగా సాధారణ మనుష్యులకంటె తెలివైన శూద్రునకు ఎనిమిదిరెట్లు, వైశ్యునకు పదహారురెట్లు, క్షత్రియునకు ముప్పయి రెట్లు, బ్రాహ్మణునకు నూరురెట్లు శిక్షలు విధించవలెను. అధికారములో నున్నవారికి నాలుగువందల రెట్లు, మంత్రికి ఎనిమిది వందలరెట్లు, రాజునకు వెయ్యిరెట్లు ఇలా ఒకే నేరమునకు శిక్షలు అధికముగా నుండవలెను.

రాజసభయందు పక్షపాతముతో అన్యాయము జరిగిన, నిర్దోషికి శిక్షపడిన, కలిగిన పాపములో ఒకభాగము కర్తయగు న్యాయాధికారికి, 2వభాగము సాక్షికి, మూడవ భాగము సభాసదులకు (రాజసభకు), నాలుగవభాగము సభాపతియైన రాజునకు లభించును.

పాదో. ధర్మస్య కర్తాగం పాదః సాక్షిణ మృచ్ఛతి ।

పాదః సభాసదః సర్వాన్ పాదో రాజాన మృచ్ఛతి ॥ ... మనుస్మృతి -౮-౧౮

భావము : అధర్మమువలన కలిగెడు పాపములోనాలుగవభాగముచేసినవానికి,నాలుగవభాగము చూచుచున్న వారికి, నాలుగవ భాగము సభాసదులకు (యం.యల్.ఏ. లను, యం.పి.లకు), నాలుగవ భాగము రాజునకు చెందును. ఏలనన :

యద్యదాచరితి శ్రేష్ఠస్తత్త దేవే తరోజనః
స యత్ ప్రమాణం కరుతే లోకస్తదను వర్తతే..... భగవద్గీత - - ౫

భావము : శ్రేష్ఠులు అనగా ఉత్తములు, ధార్మికులు, మేధావులు, నాయకులు, పరిపాలకులు - వీరు ఆచరించిన కర్మలనే ఇతర సామాన్యజనులు ఆచరింతురు. శ్రేష్ఠులు వేనిని ప్రమాణములుగా స్వీకరించుదురో లోకమున్నూ ఆ ప్రమాణములనే అనుసరించును. అనగా మేధావులు, నాయకులు, పాలకులు - అవినీతి, అధర్మ కార్యముల నాచరించిన, మానవాళి యంతయు అధర్మపరులగుదురు. యథా రాజాతథా ప్రజా. కావున వారికి వారి వారి నేరములకు శిక్షలు అధికారికముగా నుండవలెను.

యథాల్పాల్ప మదంత్యాద్యం వార్యోకో వత్స షట్పదాః ।
తథాల్పాల్పో గ్రహేతవ్యో రాష్ట్రాద్రాజ్ఞాబ్దికః కరః ॥ .... మనుస్మృతి - - ౧౨౯

భావము : జలగ, దూడ, తుమ్మెద తమ ఆహారమును కొంచెము - కొంచెము గ్రహించునట్లు, రాజు పరిపాలకులు దేశప్రజల నుండి వారికి కష్టము కలుగని విధముగా సాంవత్సరికమగు పన్నులను కొంచెము కొంచెముగా వసూలు చేయవలెను.

కృత త్రేతా యుగం చైవ ద్వాపరం కలిరేవచ ।
రాజ్ఞో వృత్తాని సర్వాణి రాజా హి యుగముచ్యతే ॥ ........ మనుస్మృతి - ౯-౩౦౦

కలిః ప్రసుప్తో భవతి సజాగద్వాపరం యుగమ్ ।
కర్మ స్వభ్యుద్యతస్త్రేతా విచరస్తు కృతం యుగమ్ ॥ .....మనుస్మృతి - ౯-౩౦౨

భావము : కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అనునవి రాజుయొక్క చేష్టావిశేషములే. రాజు కూడ 'యుగము' అని చెప్పబడును. రాజు (పరిపాలకులు) సుప్తుడై ప్రయత్న విహీనుడైనచో నది కలియుగము. రాజ జాగ్రదవస్థలో నుండియు కర్మలు చేయకున్న ద్వాపర యుగము. కర్మలను చేయుటలో తత్పరుడైనచో త్రేతాయుగము. వేదశాస్త్రానుసారం కర్మలను చేయుచు సంచరించిన కృత యుగము నగును.

భారతదేశమున తద్వారా యావత్ ప్రపంచమున పునః వేదజ్ఞానము వెల్లివిరిసి, వైదిక పరిపాలనా విధానము విలసిల్లుగాక! తత్ఫలముగా యావత్ప్రపంచమున మానవుల నుండి అవినీతి, అధర్మము, దుష్కృత్యములు, ఆటవిక న్యాయము వైదొలగి మానవాళి సంపదలతో సుఖ శాంతులతో జీవింతురుగాక!

*(మహర్షి దయానందసరస్వతులవారి సాహిత్యసంపద, మద్గురువరేణ్యులు కళాప్రపూర్ణ దర్శనాచార్య శ్రీ గోపదేవ్‌గారు ఒసంగిన జ్ఞానభిక్ష నా యీ రచనకు ఆధారము)*




# Sri Sai Sadan

**SBI - Hanuman Temple Main Road, Puttaparthi - 515 134.**
**Anantapur Dist. (A.P.) India.**
**Ph : 08555-87507, 87508 Fax : 08555-87508**

1. Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bed Room, Sitout and attached toilet.
2. Every suit is equipped with Fridge, Telephone, Geyser.
3. Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.
4. Air-conditioned Suits are also available.
5. A pure vegetarian Restaurant with South Indian, North Indian & Continental dishes.
6. STD, ISTD, FAX Facilities.
7. A Doctor on call.
8. Safety Lockers.
9. Ample parking space.
10. Prompt service and best facilities at affordable Tariff.

**Registered Office :**
**6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004.**
**Phones : Off : 3394320, Res : 3313796 (STD : 040) Fax : 394320**

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 503. కడప జిల్లా.**

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును.

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

## రిజిష్టర్డు నెం. 328/94

## బ్రహ్మంగారి మఠం - 516 503. కడప జిల్లా.

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును.

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 25025.